# బి.యన్. భాషితాలు

మొదటి భాగము

వాస్తుశిల్పి
బి.యన్. రెడ్డి M.S. (U.S.A)

సుకృత పబ్లికేషన్స్
8-2-467/4, రోడ్ నెం. 5,
బంజారా హిల్స్, హైదరాబాదు - 500 034

# బి.యన్. భాషితాలు

రచయిత: వాస్తుశిల్పి బి.యన్. రెడ్డి

ప్రథమ ముద్రణ జూన్, 1988

ద్వితీయ ముద్రణ: ఆగష్టు, 1989
ప్రతులు: 2000

చిత్రకారుడు:
పవన్

వెల:
[redacted] రూపాయిలు
32/-

ప్రతులకు:
విర్గో ఆర్కిటెక్ట్స్
6-1-1063/3, లకిడీకాపూల్
రాజభవన్ రోడ్,
హైదరాబాదు - 500 004

ముద్రణ : ప్లానోగ్రాఫర్స్ హైదరాబాద్

# అంకితం

ఎదుటివాడి మంచిని కోరే
ప్రతి సహృదయుడికీ
నా యీ భాషితాలు అంకితం

—— బి.యన్. రెడ్డి ——

# నేనీ భాషితాలు ఎందుకు వ్రాస్తున్నాను?

మానవజన్మ ఎత్తిన ప్రతి జీవీ ఎంతోకొంత చదువుకొని ఒక ఉద్యోగం సంపాదించి, ఓ తోడు చూసుకొని - ఆనందంగా జీవితం గడుపుతూ, పిల్లాపాపా అంతా క్షేమంగా వుండాలని కలలు కంటాడు. ఈ కమ్మటికలలు కాస్తా చెదరిపోయే సరికి కలవరపడుతుంటాడు. ఆవేదన పడుతుంటాడు. ఒక పాశ్చాత్య రచయిత నుడివినట్లు మనిషి పిన్నవయస్సులో, తల్లి, తండ్రి, బంధుమిత్రుల మధ్య పెరిగి కాలేజీ నుండి బయటపడి, ఉద్యోగం లేదా వ్యాపారంలో స్థిరపడకముందే వివాహం జరిగి, ఒకరిద్దరు పిల్లలు కలిగి, జీవితమంటే ఏమిటి? సమాజం అంటే ఏమిటి? తన చుట్టూ వున్న పరిస్థితుల మధ్య తమ జీవితాన్ని ఒడుదుడుకులు లేకుండా నడపాలంటే ఏం చేయ్యాలి? అనే ఆలోచన ప్రారంభించే సరికి నలభైయేళ్లు వస్తున్నాయి. అప్పుడు అతను సమాజంలో ఎలాంటి పరిస్థితుల్లో బతుకుతున్నాడు?

మనుషుల్లో అసూయాద్వేషాలు పెరిగిపోయి స్వార్థం ప్రబలి ప్రేమానురాగాలు నశించి,, ఒకరికొకరు సహాయ సహకారాలు అందించుకొనె బదులు ఎదుటవాడిప ఎలాంటి ఇబ్బందులు పెడితే తమ పబ్బం గడుస్తుంది - ఇవన్ని అతని కళ్ళెదుట జరుగుతుంటే పుస్తకాల్లో చదివిన ఆదర్శప్రాయమైన కథలు, చిన్నతనంలో విన్న వీరగాథలు అన్నీ మిథ్యలా కనిపించి, కలలన్నీ కరిగిపోయేసరికి నిరుత్సాహంతో కృంగిపోతుంటాడు. ఇలాంటి సమయంలో ఒక మంచి స్నేహితుడు, ఒక మంచి గ్రంథం అతనికి కొంత ఉత్సాహాన్నిచ్చి కార్యోన్ముఖుణ్ణి చేయవచ్చు -

"సంశయములు నన్నావరించినపుడు, నిరాశా నిరుత్సాహములు జనించినపుడు నేను భగవద్గీతను తెరచి చూచుదును. అందు ఏదో ఒక శ్లోకము నన్నూరడించును" అని జాతిపిత గాంధీ ఎంత బాగా సెలవిచ్చారు!

జీవిత సత్యాలను తెలియచెప్పే భగవద్గీత, పురాణేతిహాసాలు, భర్తృహరి సుభాషితాలు, వేమన పద్యాలు, సుమతీ శతకంలాంటి పుస్తకాలెన్నో వున్నాయి. అవి చదివి వారివారి జీవితాలకు అన్వయించుకొంటున్నారు.

కాలం మారింది, పరిస్థితులు మారినవి. మారుతున్న కాలంలో మనిషి ఏం చేయాలి - ఏ విధంగా ప్రవర్తిస్తే మనలో ప్రబలుతున్న అసంతృప్తి తగ్గుతుంది, మన సమాజం బాగుపడుతుంది అనే విషయాలను మళ్లీ ఒకసారి నెమరువేసుకోవడమే యీ

భాషితాలు. మరచిపోవడం మానవ నైజం, నిన్నటిదే ఇవాళ మరచిపోతున్న మనం, మనం చదువుకొన్నవి, మనపెద్దలు చెప్తుంటే విన్నవి, ఎప్పుడో మరచిపోయాం. అంతే కాదు పాత విషయాలు పాత పద్ధతిలోనే చదవాలన్నా, వినాలన్నా విసుగొస్తుంది. అదే కొత్త పద్ధతిలో చెప్తే రామాయణమైనా, మహాభారతమైనా మళ్లీ మళ్లీ వినాలనిపిస్తుంది. అందుకే నేను జీవితంలో చూసినవి, తెలుసుకొన్నవి, అనుభవించినవి, అప్పుడప్పుడూ మననం చేసుకొంటుంటే ఎన్నో విషయాలు మనఃఫలకం మీద తరంగితం అవుతుంటాయి, ఆ సమయంలో మనలో మంచిమార్పు వస్తుంది. ఆ మార్పే నన్ను వ్రాయడానికి, వ్రాసుకున్నది ప్రజల ముందు పెట్టడానికి ప్రేరేపించింది. నేనేదో గొప్పపని చేశానని చెప్పుకోవడం లేదు - నేను చదివిన వాటిలో, విన్నవాటిలో చూసినవాటిలో, పలుగురితో మాట్లాడిన అనుభవాలతో యీవిధంగా వ్రాసుకొన్నాను. ఇందులో ఉర్దూ శైలి వుండొచ్చు, సంస్కృతచ్ఛాయలుండొచ్చు, ఇంగ్లీషు రచనల ప్రభావముండొచ్చు - నా భావాలు పాఠకులకు కొంతవరకు నచ్చితే, నా కృషి ఫలించినట్లే.

ఉదాహరణకు - ''మేరు పర్వతమంత మేధాశక్తి కన్నా ఆవగింజంత అదృష్టం మిన్న'' అనే భావాన్ని తెలిపే ఒక సంస్కృత శ్లోకం వున్నది - ఈ విషయాన్ని కొంతమంది ఒప్పుకోవచ్చు - మరి కొంతమంది ఒప్పుకోకపోవచ్చు. కాని జీవితంలో మనం చూస్తున్న ఎన్నో విషయాలను గమనిస్తే అది నిజమే అనిపిస్తుంది అదే విషయాన్ని నేను ఈ విధంగా వ్రాశాను.

''బతుకంతా బండచాకిరి చేసినా తిండి దొరకని వాణ్ణి
కష్టం చేయకుండానే అన్నీ అనుభవించే వారిని
అర్హత లేకుండానే అందలం ఎక్కేవారిని - చూస్తుంటే
మేరుపర్వతమంత మేధాశక్తి కన్న - ఆవగింజంత అదృష్టం మిన్న'' అనిపిస్తుంది.

చివరిగా జీవితం గురించి ఒక విషయం. మనిషి కృషిచేసి అభివృద్ధి చెందుతున్నాడా లేక అదృష్టం వలన పైకి వస్తున్నాడా అనే విషయం చాలా క్లిష్టమైన సమస్య -

నేను వ్రాసిన వాటిల్లో కొన్ని కృషికి ప్రాముఖ్యం ఇచ్చేవిగా వుండవచ్చు. మరికొన్నిటిని చదివితే, అదృష్టము లేకపోతే మనిషి ఏమీ సాధించలేడు అనే విధంగా కూడా స్ఫురించవచ్చు - జీవితానుభవం దృష్ట్యా కృషి - అదృష్టం రెండూ అవసరమే.

అదృష్టం బాగుంటే కృషి చేయకుండానే బాగుపడతామనే ఆలోచనలతో మనం జీవితం నాశనం చేసుకోకూడదనే దృఢమైన విశ్వాసంతో ఈ భాషితాలను పాఠకలోకం ముందు వుంచుతున్నాను. ఇందులో ఏకొన్నైనా సమాజ కళ్యాణానికి తోడ్పడినా, మానవునిలో మంచితనానికి బాటలు వేసే ఆలోచనలను రేకెత్తించగలిగినా నా ఈ సాహిత్యకృషి సఫలీకృతమైనట్లుగా భావిస్తాను.

— బి.యన్. రెడ్డి

హైదరాబాదు,
16-6-88

# లోకాయుక్త
# జస్టిస్ ఆవుల సాంబశివరావు

ప్రియమైన బి.యన్. గారికి-

మీ భాషితాలు చదివాను. నెమరువేసుకొన్నాను.
అందాల పదాల అల్లిక జోలికి పోలేదు మీరు.
భావాన్ని భాషితంగా మార్చడమే మీ ఆశయం.
మీ భావాలు మీ జీవితం పండించిన రాజనాలు.
మీ చూపులు సేకరించిన పూవులు.
అనేక పోకడలు పోయిన మీ జీవితం
అనేకానేకాలైన అనుభూతుల్ని అందించడంలో
అబ్బురమేముంది ?
భర్తృహరి సుభాషితాలు
వేమన్న ఆట వెలదులు
మీ భాషితాల్లో గమనానికి వస్తున్నాయి.
అన్ని పొంకాలున్న అనుభూతిని
సున్నితమైన సుద్దులో సుడులు తిప్పారు
నాడి, వాడి, వేడి వున్న మీ సూక్తులు
మె దడుకు గిలిగింతలు పెడుతున్నాయి.
వాతలు, మరకలు వేస్తున్నాయి.
వాస్తు శిల్పి బి.యన్.
భావ శిల్పి బి.యన్. అయినారు.
అభినందనలు అందుకోండి.

# అభిప్రాయం

రాళ్ళూ, రప్పలకు పరీక్షలుండవు, శిక్షలుండవు. మనిషికే పరీక్షలైనా, శిక్షలైనా. విషమపరీక్షల్లో సునాయాసంగా ఉత్తీర్ణత పొందాలని, విధించిన శిక్షలను తప్పుకొని ఎదురులేని జీవయాత్ర సాగించాలని మనిషి తపన, సాధన.

మనిషి గురించి రాయాలంటే ఎంతో అనుభవం కావాలి. అంతకు రెండింతల అధ్యయనం కావాలి. అనుభవం వల్ల మనిషి ఉనికిని అంచనా వేయవచ్చు. అధ్యయనం వల్ల ఆ అంచనాకి అంచులు దిద్దొచ్చు.

మిత్రుడు శ్రీ బి.ఎస్. రెడ్డి విద్యావివేకాలున్న హృదయజీవి. క్రమశిక్షణం, సమవీక్షణం సమన్వయించుకొన్న బుద్ధిజీవి. అనుభవాన్ని అధ్యయనాన్ని కలుపుకొని లోకాన్ని గురించి టీకలు రాసే నేర్పున్న వాస్తవశిల్పి.

బి.ఎస్. తన అభిప్రాయాలను భాషితాలుగా ప్రకటిస్తున్నాడు. సుభాషితాలు అనడం సంప్రదాయం. బి.ఎస్. తెలివి ఇక్కడే కనిపిస్తున్నది. అవి సుభాషితాలో, కావో తేల్చేది లోకమే. గుండెను చీల్చుకొని వెలువడిన భావాలను వాక్యాలుగా మార్చి సరళంగా అందించడం తన లక్ష్యంగా పెట్టుకొన్నాడు. బి.ఎస్. 'సమయం - సందర్భం' అనే భాషితం తీసుకొందాం. సమయ సందర్భాల ఔచిత్యాన్ని చాటి చెప్పడానికి అతడు కుక్కను దృష్టాంతంగా తీసుకొన్నాడు. మొరగడం కుక్క లక్షణం. ఇంటి కుక్క మొరిగితే ఉన్న విలువ బజారు కుక్క మొరిగితే ఎక్కడుంటుందని ప్రశ్నిస్తున్నాడు. దీన్ని ఎవరు కాదంటారు. సార్వజనీన సత్యమిది. ఇలాంటివి ఈ సంపుటిలో పుటపుటలో స్ఫుటంగా కనిపిస్తుంటాయి. 'లోకంపోకడ', 'రడీక్యాష్', 'మహాత్ముడు' ఈ కోవకు చెందినవే. మధ్య తరగతి మనిషి అభిప్రాయాలకు, అభివ్యక్తికి ఎంతో సన్నిహితంగా ఉన్న ఈ భాషితాలు బహుజనాదరణ పొందుతాయని, కొన్ని కొన్ని నిత్య జీవితంలో ఉదాహరణ యోగ్యంగా మిగిలిపోతాయని నా అభిప్రాయం.

డా॥ సి. నారాయణ రెడ్డి

కులపతి, తెలుగు విశ్వవిద్యాలయం

# నీతికి జయకేతనములు

చైతన్య విలసితమ్ములు
జాతిని ఉత్తేజపరచు సంకీర్తనముల్
ఖ్యాతికి, చేతః ప్రీతికి
నీతికి జయకేతనములు నీ భాషితముల్ !

పొత్తము చిన్నదయ్యు రసపుష్టికి తుష్టికి లోటులేని, నీ
ఉత్తమ సూక్తి మంజరిని ఉత్సుకతన్ తిలకించి పెక్కు కొం
గ్రొత్త మనోజ్ఞ సంగతుల గూర్చి రచించు భవద్విశిష్ట, సం
పత్తికి మెచ్చి యిచ్చితిని పద్దెము గైకొనుమయ్య మిత్రమా !

సహజకవి
మల్లెమాల

# బహుభాషితాలు

"లోకం నన్ను గుర్తించలేదని
వూరికే బాధపడేకన్నా
లోకాన్ని నేను అర్థం చేసుకున్నానా
అని ఆలోచించడం మిన్న"

తమ గురించి మాత్రమే ఆలోచించేవారు కొంతమంది కాగా, బహు కొద్ది మంది మాత్రం లోకం గురించి కూడా ఆలోచిస్తూ వుంటారు. ఈ సమాజం యిలా ఎందుకుంది? దీనిని మార్చాలంటే మనం యేమి చేయాలి? కష్టాలకు కారణాలెక్కడున్నాయి? మంచివాళ్ళకే ఎందుకిన్ని కష్టాలు? స్వార్థపరులు అందలాలెక్కి ఎలా వూరేగుతున్నారు?

వాస్తు శిల్పి శ్రీ బి.యన్. రెడ్డి వేరు. కవిగా ఆలోచనాశీలిగా బి.యన్. రెడ్డి వేరు. ఒకరు ఇంజనీరయితే మరొకరు కవి. ఈ కవి ఆలోచించి ఆ ఇంజనీరుకి లోకం గురించి చెప్పడమే ఈ 'భాషితాలు'! తను తెలుసుకున్నది కవి మనకు చెబుతున్నాడు. అవే బహుభాషితాలుగా వెలిసినై.

ఆత్మ విశ్వాసం అనే ఖండికలో -

కుంభవర్షం కురిసినా
బోర్లించిన కుండలో నీరు నిలవనట్లే
ఆత్మ విశ్వాసం లేనివాడు
విశ్వమంతా తిరిగినా వీసమెత్తు సాధించలేడు

ఈ ఆత్మ విశ్వాసం అనే భాషితం ఒక జీవితానుభవసారాన్ని చాటి చెప్తుంది. మానవ సంక్షేమం సౌభాగ్యం కోసం అనాదిగా అనేక మంది మహానుభావులు, కవులు, పండితులు, భక్తులు, ఋషులు ఎన్నో విధాలుగా మంచి మాటలు చెపుతున్నారు. ఇంకా ఎన్నో విషయాలను కావ్యపురణేతిహాసాలు ద్వారా చెప్పారు. చెబుతూనే వున్నారు. ఇక ముందు కూడా చెప్తారు. ఈ మానవ జీవితానుభవసారాన్ని విప్పి చెప్పడంలో వినుగుచెందని ఆసక్తి కలవారిలో వాస్తు శిల్పి బి.యన్. రెడ్డిగారొకరు. రెడ్డిగారి భాషితాలు

సహజ సుందరంగా వుండి వినివినగానే స్విచ్ వేసి మెదడును ఆలోచింపజేసేవిగా వుంటాయి.

ఇది చూడండి -

బంగారు లేడి వెంటపడి భార్యను కోల్పోయాడు రాముడు
కౌరవులతో జూదమాడి ద్రౌపదిని ఓడినాడు ధర్మజుడు
బంగారు లేడి వుండదని - భార్యను పణంగా పెట్టకూడదనీ
ఆ మహానుభావులకు తెలియకనా - వారి ఖర్మకాకపోతే

ఇది పౌరాణిక విషయాలమీద విచికిత్స లాంటిది. బుద్ధిః కర్మానుసారిణి అన్నట్లు అది అలా నడిపిస్తుంది. ఈ భాషితం కూడా మనల్ని ఔరా అని ఆలోచింపచేస్తుంది. నిజానికి అన్నీ అందరికీ తెలుసు - మనం చెప్పేదేముంది? చెబితే వినేవాడెవడు? నా సుభాషితాన్ని నాలో నేనే దిగమింగుతాను అని కాబోలు భర్తృహరి అంతటివాడు అనేశాడు. రెడ్డిగారు ఆశావాది. ఆయన తనకు తాను భాషితాలు వల్లె వేసుకుంటూ నిరుత్సాహాల్ని జయించగలడు. ఈ భాషితాలు బి.యన్. రెడ్డి గారికే కాక అందరికీ జీవనయాత్రలో దారిబత్తెంలా వుపకరిస్తాయి.

బెంజిమిన్ ఫ్రాంక్లిన్ అనే అమెరికన్ రచయిత 'పూర్ రిచర్డ్స్ ఆల్మనిక్' అనే పేర ఎన్నో భాషితాలు చెప్పాడు. కన్యాశుల్కంలో గిరీశం 'మేక్ హే వైల్ సన్ షైన్స్' అంటాడు. పూర్ రిచర్డ్ చెప్పినట్లు 'పేషెన్స్ వుంటేనే గాని యీ లోకంలో నెగ్గలేం' అంటాడు పూటకూళ్లమ్మకు డబ్బు ఎగ్గొట్టి డాన్సింగ్ గర్ల్స్ కింద ఖర్చు పెట్టడం గురించి ప్రస్తావిస్తూ. పూర్ రిచర్డ్ అంటే బెంజిమిన్ ఫ్రాంక్లినే - బి.యన్. రెడ్డి గారు పూర్ రిచర్డ్ చెప్పినట్లే సరదాగా చెబుతున్నారని నాకు అనిపించింది.

సుమతీ శతకం, వేమన శతకం దగ్గర్నుంచి మన శతకాలన్నీ భక్తి ప్రధానమైనవి, శృంగార వైరాగ్యాలు తప్పితే నీతి శతకాలే కదా! ఇప్పుడవన్నీ చదివే ఓపిక లేదు, భాషరాదు నేటి కాలపుజానానికి. ఈ కాలపు జనానికి యీ కాలపు రచయిత అనగా మన బి.యన్. రెడ్డి అందిస్తున్న భాషితాలే నచ్చుతున్నాయి. పెద్ద పెద్ద సంగతులను, గంభీరమైన విషయాలను, నిత్య సత్యాలను 'వాటర్ డవున్' చేసి సామాన్యులకు ఎలాగ అందివ్వాలో యీ రచయితకు బాగా తెలుసు. ఇవి పండితుల కోసం కాదు పామరుల కోసం అంటే ఎవరూ కోపపడనక్కరలేదు వీటిలో ధ్వనులూ ప్రతిధ్వనులూ వుంటాయి. అన్వయించుకునేవాడి ప్రజ్ఞనుబట్టి భాషిస్తాయి.

'లేదు' అనే భాషితంలో నేటి సామాజిక వ్యవస్థా స్వరూపం యొక్క వికార రూపాన్ని ఆవేదనతో యిలా చెబుతున్నాడు కవి -

విద్యాలయాల్లో విద్య నేర్చుకోవడం లేదు
కార్యాలయాల్లో పని నేర్చుకోవడం లేదు
సంసార జీవితంలో సఖ్యత నేర్చుకోవడం లేదు
అన్నీ తెలుసుననే అహంభావంతో ఏదీ నేర్చుకోవడం లేదు

బహుశా నేటి యువతకు యీ మంచి మాటలు వర్తించవచ్చు.

ఈ లోకం పట్ల దీని మంచితనం పట్ల మనిషికి ఆశ చావలేదనడానికి యీ 'భాషితాలు' మచ్చు తునకలు. ఈ ప్రపంచం యిందరి మనుషులపట్ల బి.యన్. రెడ్డిగారికి ఎంతో ప్రేమ వున్నదని రుజువు చేయడానికి యీ 'భాషితాలు' వుపయోగిస్తాయని నేను నమ్ముతున్నాను.

పురాణం సుబ్రహ్మణ్య శర్మ
సంపాదకులు, ఆంధ్రజ్యోతి వారపత్రిక

---

## వాస్తుశిల్పికి వందనాలు

రాయి రప్పను చేరదీసి
రమణీయాకృతి కల్పించే భవన శిల్పి
సుభాషితాలలో వాస్తవ
సుఖ దుఃఖాలను పొదిగే అక్షరశిల్పి
పలుకుల్లో కలకండ
పలుకు లొలికే మధుర వాక్శిల్పి
''వాస్తు శిల్పి'' బి.యన్. రెడ్డికి
హితుల పాలిటి వేల్పు గిడ్డికి
స్నేహ సురభిళ వందనాలు
సాహితీ జయాభినందనలు.

డా॥ ఉండేల మాలకొండా రెడ్డి

# సాధువాదం

మహా ప్రబంధ నిబంధనానికి కాలం చెల్లిందనిగానీ మహాకావ్య రసాస్వాదనా దీక్షాపరులు నేడు లేరని గాని చెప్పలేము. దేశకాల పాత్రలలో ఊహించని మార్పులు తరుముకు వచ్చాయి. యుగధర్మాన్ని బట్టి అభిరుచులూ, ఆదర్శాలూ మారాయి. అభినవ నాగరకతా గంధంలో ఊపిరాడక, అత్యాధునిక సాంకేతిక యాంత్రిక బంధంలో ఊరట దొరకక ఉరుకుల పరుగుల ఇరకాటపు పోటీ బతుకుల పయనపు పందెంలో ఉక్కిరిబిక్కిరవుతున్న జనులకు మహా కావ్య పఠన పాఠనాలపై ఉబలాటమున్ననూ ఉసులుబాటెక్కడిది? అందులకే ఇలాంటి కవితా శిల్ప ఖండికలు బతుకుల గతుకులలో పరుగుల బరువులతో అలసి సొలసిన తెరువరులకు ఒయాసిస్సులవంటివి.

'అల్పాక్షరాల అనల్పార్థ రచన' మన్న ఆభాణకానికి ప్రస్తుత కృతి 'బి.యన్. భాషితాలు' చక్కటి తార్కాణం. 'అల్పాక్షరమసంధిగ్ధం సారవద్విశ్వతోముఖ' మ్మని లాక్షణికులు నిర్వచించిన సూత్ర లక్షణం. అవి ఆయా శాస్త్రార్థాలకు సూక్ష్మప్రాయ సూచికలు. వార్తికాలు, భాష్యాలు, వ్యాఖ్యానాలు సాయం ఉంటేనేగాని సూత్ర భావం సాధకులకు సుబోధం కానేరదు. అయితే, మన రెడ్డిగారి భాషితాలు సూత్రాలవంటివైనా నేటి ప్రపంచంలో పంచారించిన చేదు నిజాలను వివరించే వీచికలు. అలతి అలతి పలుకులలో వలతి వలతి భావాలను నింపుకున్న ఇందలి కావ్య ఖండికలన్నీ పరస్పర నిరపేక్షకాలైన ముక్తకాలు. తులలేని వెలలేని మౌక్తికాలు. తేట తెలుగులో చెప్పాలంటే పులుగడిగిన ఆణిముత్యాలు. ఒక మహాయోగి దర్శించిన విజ్ఞానపు నిత్యసత్యాలు. ఒక్కొక్కటీ ఒక్కొక్క ముత్యం. వీటి ఎంపికా, వీటిని పోహళించిన తీరూ రెడ్డిగారి ఉక్తి వైచిత్రికీ, ఊహా దోహలానికీ చక్కటి ఉదాహరణలు. విస్తృతమైన లోకానుశీలనమూ, పరిణతమైన ప్రజ్ఞావిభవమూ, విశిష్టమైన ఆవిష్కరణ విధానమూ వీటి ముఖ్య లక్షణాలు. ప్రతి ఖండికలోని ఎత్తుగడా, ముక్తాయింపూ, చమత్కారచారుతను ప్రకటిస్తాయి. ఇవి నిజంగా సుభాషితాలైనా రెడ్డిగారు వీటిని 'సుభాషితాలు' అని అనలేదు. వీరి వినయ ప్రవృత్తికీ, పెద్దలపట్ల వీరికిగల ప్రపత్తికీ ఇది ఒక నిదర్శనం.

సహృదయులను ఆకట్టుకోగలిగిన స్పష్టతా, సరసతా, సమర్థతా, సమగ్రతా, సంగ్రహతా ఉత్తమ కావ్య శరీరానికి పంచప్రాణాలు. ఈ ఆయువుపట్టులను మట్టసంగా పట్టుకోగలిగిన కావ్యశిల్పులు నిజంగా అజరామరులు. తిరువళ్ళువర్, అవ్వైయార్,

బసవన్న, వేమన్న, సర్వజ్ఞుడు, తుకారాం, సూరదాసు మొదలైన మహాకవులు ఈ కోవకు చెందినవారు. మూడు మాటలు – ఆరు తప్పులుగా రూపెత్తిన కావడి మోతల రాతలు కాదు ఈనాడు మనకు కావలసింది. 'నిక్కమైన మంచి నీలమొక్కటి చాలు' అన్న తెలుగు చైతల మిన్న వేమన్న వాక్కు వేదవాక్కు. కావ్యరసిక ప్రవరులను రసానందసీమకు, ఉదాత్త సంస్కారభూమికి కొనిపోగలిగిన రచన ఒక పద్యమైనా చాలు, ఒక పాదమైనా చాలు, చివరికి ఒక్క పదమైనా చాలు. అందుకే 'వాక్యం రసాత్మకం కావ్య'మ్మన్నారు ఆనందపర్యవసాయైన లక్షణ జగన్నాథులు. సాహిత్యతత్త్వ పరామర్శకు ఎన్ని పేర్లు పెట్టినా, ఎన్ని దారులు పట్టినా చిట్టచివరకు చేరవలసింది పైన చెప్పినట్లు ఆనందసీమ, సంస్కారభూమి వస్తుతః శ్రీ రెడ్డిగారు నిత్యం ప్రశస్తిని బడసిన వాస్తుశిల్పి. ఉత్సాహశీలత వారి ఊపిరి; ఉల్లాసశీలత వారి ఉద్యమం. వాస్తుశిల్పిగా ఆయన ఆలోచనాధారా, వ్యూహరచనా నైపుణ్యమూ, రూపకల్పనా ప్రావీణ్యమూ, సరిసాటిలేని సమయపాలనమూ జగమెరిగిన సత్యాలు. ఈ ఉదాత్తలక్షణ సంపుటియే అచ్చంగా ఆయన కావ్యసృష్టిలో, అదే మూసలో పోతబోసిన రసఘుటికలు. 'ముఖే ముఖే సరస్వతీ'.

ఉత్తమాదర్శాలనూ, ఉన్నతాలోచనలనూ, ఉదాత్తవర్తనలనూ ఉపశ్లోకించడానికి తెలుగులో తగినన్ని ప్రశంసార్థక పదాలు నా అల్పబుద్ధికి తోచనందువల్లనూ, 'మేలు మేలు' వంటి ఒకటి రెండు తెలుగు పలుకులలో బరువూ, బలమూ చాలదంటారేమో అన్న ఆశంకవల్లనూ, పరాయి భాషాపదాలలో 'భేరియో' అని, 'సేబాసు' అనీ కృతినిర్మాతలకు సాధువాదాలు పలుకుతున్నాను.

ఈ కావ్య సంపుటిలోని అక్షరచిత్రాలకు అమడలుగా, అండదండలుగా అందగించిన రేఖాశిల్పాలు బి.యస్. కవితా హృదయానికి నిలిపిన నిలువుటద్దాలు. ఈ శిల్ప ఖండాలను ఈ తీరున పరికల్పన చేసిన శిల్పులకూ, ఈ ఉత్తమ సృష్టికి ప్రేరణనిచ్చిన కళ్యాణ సంకల్పులకూ మనఃపూర్వకమైన అభినందనలూ, అభివందనాలూ.

శ్రీ రెడ్డిగారు చిన్న చిన్న గుళ్ళూ, చిటారు గూళ్ళూ కూడా పరికల్పన చేయగల సమర్థులు. తీయతీయటి పలుకుబళ్ళతో ఒళ్ళు చేసినవే ఈ భాషితాలు. వారు నిర్మించిన మహాసౌధ సముదాయాలు వారి అపార ప్రతిభా సంపత్తికీ, అపూర్వ శాస్త్ర వ్యుత్పత్తికీ ఉత్తమోత్తమ ప్రతీకలు. ఖండకావ్య నిర్మాతలుగా ప్రశస్తిగాంచిన శ్రీ రెడ్డిగారిని మహాకావ్య రచనాదీక్షాదక్షులుగా చూడాలన్న ఆశ ఉంది. నాది అత్యాశకాదు. స్వస్త్యస్తు.

ఆచార్య తూమాటి దొణప్ప

# మౌక్తిక హారం

"బి.యన్. మంచివాడు"
"బి.యన్. నిజాయితీపరుడు"
"బి.యన్. మంచి స్నేహితుడు"
"బి.యన్. కవితాత్మ కలవాడు"

మిత్రులూ, పరిచయస్తులూ బి.యన్. రెడ్డిని గురించి పరోక్షంగా అనుకునే మాటలివి. ముఖస్తుతులూ కావు. అతిశయోక్తులూ కావు. అన్నీ నిజంగానే నిజాలు.

రచయితల వ్యక్తిత్వాలూ, గుణగణాలూ వారివారి రచనలలో వ్యక్తంకావాలన్న నియమంగాని, వ్యక్తమవుతాయన్న పూచీగాని ఎక్కడాలేదు. రచయితల విశ్వాసాలు రచనల్లో ప్రతిబింబించని సందర్భాలూ ఉన్నాయి.

బి.యన్. రెడ్డి రచనలు మాత్రం అతడి వ్యక్తిత్వానికీ, మూర్తిమత్వానికి గూడా అద్దంపడుతున్నాయని నిస్సందేహంగా చెప్పవచ్చు.

"నీ జీవితాన్ని తూచిచూడు
నీవు పనిచేసే త్రాసులో
ఎంతకాలం చేశావనేది కాదు
ఎంత సాధించావనేది ముఖ్యం"

అంటున్న బి.యన్. రెడ్డి తన జీవితానికి ఒక ఆదర్శాన్ని, ఒక లక్ష్యాన్ని నిర్దేశించుకొని, తత్సాధనలో తను చేస్తున్న పనిని నిరంతరం బేరీజు చేసుకొంటున్న విశిష్ట వ్యక్తి. అతడు తూకం వేస్తున్నది తాను పనిచేసిన, చేస్తున్న కాలాన్ని కాదు. లక్ష్యాన్ని ఎంత వరకు సాధించానని మాత్రమే. "మంచివాడు", "నిజాయితీపరుడు", "మంచిస్నేహితుడు", "కవితాత్మ కలవాడు" అని మిత్రులు అనుకొన్నారంటే అది బి.యన్. నిర్ణయించుకొన్న జీవిత లక్ష్యం ప్రభావమే, అతడి జీవిత విధాన ఫలితమే.

నిర్మాణాలు బి.యన్. వృత్తి. అతడి దృక్పథం నిర్మాణాత్మకమైనది. అది అతడి రచనలలో తరచు కనిపిస్తుంది. "సామన్యుడి సందేశం" ఇచ్చిన సందేశం అదే. ఇప్పుడు

మీ చేతుల్లో ఉన్న "భాషితాలు" సైతం అదే అంటున్నవి.

"కష్టాల కడలిలో కన్నీళ్లు
త్రాగడం నేర్చుకో
నిరాశా నిస్పృహల నివారణకు
ఆత్మధైర్యం పెంచుకో"

అదీ బి.యన్. ప్రబోధం.

మంచి మాటలు చెప్పడానికి మహా కవి కానక్కరలేదు. తనను "సామాన్యుడు"గా ఇది వరకే ప్రకటించుకున్నాడు బి.యన్. అలా అనుకొనే "సామాన్యుడి సందేశం" రాశాడు. ఇప్పుడు "భాషితాలు" ప్రచురించడంలోనూ వినయంతో కూడిన మనస్తత్వమే కనిపిస్తుంది. "సుభాషితాలు" పలకడానికి తాను "భర్తృహరి"నికానని అతడి అభిప్రాయం కావచ్చు. బి.యన్. వినయసంపద అతడి భౌతిక సంపదని మించినది.

ఎవరైనా ఒక మంచి మాట మాట్లాడినప్పుడు, ఎక్కడైనా ఒక మంచి పంక్తి చదివినప్పుడు వెంటనే స్పందించడం బి.యన్. స్వభావం. అది అతడి ఆలోచనలకు రూపుదిద్దింది. అతడి రచనలకు అది బలం, అది ఊపిరి.

బి.యన్. భాషితాలన్నీ ఎప్పుడూ ఎవరూ చెప్పని కొత్త ఆలోచనలు కాకపోవచ్చు. ఎప్పుడో ఎవరో చెప్పినవి అందులో కొన్నయినా ఉండవచ్చు. "ఏది రాసినా ఏం లాభం, ఇదివరకెవడో అనే వుంటాడు, బహుశా ఆ అన్నదేదో నాకంటే బాగానే అని వుండొచ్చు." అని శ్రీశ్రీ ఎప్పుడో అననే అన్నాడు. అలా అనుకొని అనదలచుకొన్నది అనకుండా రచయిత ఉండలేదు. రాయకుండా ఉండలేక రాసినవే "భాషితాలు" సమాజశ్రేయస్సును కోరేవారు ప్రతి తరంలోనూ తాము మంచి అనుకొన్న మాటలను తమదైన పద్ధతిలో చెప్పడం కనిపిస్తుంది. ఏ తరానికి ఆ తరం తమకు అర్థమయ్యే భాషలో, అర్థమయ్యే రీతిలో అనుభవజ్ఞులు, విజ్ఞులు రాసిన పుస్తకాలు చదవడం అవసరమే.

బి.యన్ భాషితాలు భావ సౌందర్యభూషితాలు, సూక్తి మౌక్తికాలు.

పొత్తూరి వెంకటేశ్వరరావు

సంపాదకులు, ఆంధ్రప్రభ

# అభినందన చందనము

మానవజీవితాన్ని సమగ్రంగా సాంగోపాంగంగా అర్థం చేసుకోవాలంటే - 'మహాభారతం' - చదవాలి; అథవా భర్తృహరి సుభాషితాలు అనుశీలించాలి అని నా అభిప్రాయం

సుభాషితం అంటే -''అల్పాక్షరముల అనల్పార్థ రచన''. సామెత సుభాషితానికి తల్లి, అనుభూతి తండ్రి. ''పలుకు కవి యొకండు పదిమంది అనుభూతి'' ''మరపురాని మేలిమాటలేరి'' సుభాషితం కాలమహాస్రవంతికి ఎదురీది చిరకాలం జీవించ గలదు.

వాస్తుశిల్పి శ్రీ బి.యన్. రెడ్డిగారు భర్తృహరి కవికోవకు చెందినవారు. మనిషి బ్రతుకు - వెలుగు నీడల వింత మెలిక. వయసుకు మించిన అనుభవం గడించిన వ్యక్తి వాస్తుశిల్పి.

II

''కవిత - కవిత కొరకే'' అని వాదించే వారు కొందరు ఉన్నారు. సూర్యుడు ఎందుకు ఉదయిస్తున్నాడు? చెట్లు ఎందుకు చిగిరిస్తున్నవి? పూవులు ఎందుకు పరిమళిస్తున్నవి? అందుకే కవి కవితలు అల్లుతాడు! కవితకు పరమార్థం రసానందమే. సద్యః పరనిర్వృతితి - అని వీరి వాదం. ''విశ్వశ్రేయః కావ్యమ్''. కవితకు అంతరాత్మ,''జగద్ధితము'' అని వాదిస్తారు ఇంకోవర్గంవారు. సుభాషితాలలో ఈ రెండు వాదాలు గంగాయమునల వలె సంగమిస్తాయి. ''వాక్యం రసాత్మకం కావ్యమ్'' అన్న నిర్వచనాన్ని - ప్రతి సుభాషితం రుజువు చేస్తుంది.

శ్రీ బి.యన్. రెడ్డిగారి - ''భాషితాలు'' - జగద్ధితములైన రసాత్మక కవితలు.

III

పూర్వకాలంలో ఇతిహాసాలు, పురాణాలు పెద్ద పెద్ద ప్రబంధాలు వెల్లివిరిసాయి. తదుపరి చిరుప్రబంధాలు. తదుపరి ఖండకావ్యాలు. నేడు ఈ నవనాగరికతలో - ఎండమావులను వెంబడించే ప్రజలకు పెద్ద ప్రబంధాలు కాదు గద చిన్న ఖండకావ్యాలు - కథానికలు గూడా చదివే తీరికగాని ఓర్పుగాని లేదు. సుదీర్ఘకావ్యాలకు కాలదోషం పట్టింది.

ఇక ఇది - ''మిని కవితల యుగం'' అని చెప్పక తప్పదు. ఇది నేటి అవసరం. ఇది అవశ్య సాహిత్య చారిత్రక భవితవ్యం. అద్యతన సాహిత్య జగత్తులో ముఖ్యమైన మూడు ఉద్యమాలను పేర్కొనవచ్చు.

i భావ కవిత ii అభ్యుదయ కవిత iii దిగంబరకవిత. శ్రీ బి.యన్. రెడ్డిగారి కవిత ఈ మూడు ఉద్యమాలు సంగమించే ముయ్యేల గుట్ట. సాహితీ త్రిభుజం.

వాస్తుశిల్పమును సకారత్రయంగా - సౌందర్యం: సౌష్టవం: సౌభాగ్యంగా వింగడింపవచ్చు. శ్రీ బి.యన్. రెడ్డిగారి భాషాశైలిలో భావనా స్రవంతిలో గూడా వాస్తుశిల్ప రేఖలు సాక్షాత్కరిస్తాయి. ఇక భావికాలంలో ఆలంకారికులు - బి.యన్. రెడ్డి ప్రభృతులు కొనసాగించిన మినీ కవితలు - నవీన గద్యచాటు కవితలు ప్రస్తావించి యీ క్రింది లక్షణాలు ఉల్లేఖించవచ్చు.

1. ఇవి నవీన చాటువులు.

వీటిలో ఇతివృత్తం ఉండదు. ఇవి స్వయం సంపూర్ణములు.

2. ఇవి గద్య పద్యాలు.

ఇవి ఛందోబద్ధాలు కావనే భ్రమను కల్పిస్తాయి. వీటిలో నిర్ణీత గణ యతి ప్రాసలు ఉండవుగాని, సాంప్రదాయాతీతమైన ఛందస్సు ఉంటుంది.

3. ఇవి బరువు తక్కువ; బలం ఎక్కువ అయిన తేట తెలుగు మాటల మూటలు.

4. ఇవి అణువాఙ్మయ భూకంప ప్రకంపనాలు

5. ఇందు యతి ప్రాసలు యధేచ్ఛా ప్రయుక్తాలు.

6. ఇవి వెన్నెల వడగండ్ల వానజల్లులు.

7. వీటి బాషలో భావంలో తూగుటుయ్యాల తూకం ఉంటుంది.

8. తుపాకిమందు తూటాలలో మట్టసంగా కుదించి కూరినట్లు - గుండెకు సూటిగా గురి చూచి పేల్చినట్లు ఇవి దూసుకుపోతాయి.

9. ప్రతి పద్యంలో తొలివిరుపు - మధ్య మలుపు - కొసమెరుపులు కల్పిస్తాయి.

కవిత - నరుల యెడద కరగింప వలెగాని
పశుల గట్టరాదు పొగుల జేసి
వేడి కాదు - కవిత - విరబూచు వెన్నెలే
కవిత వాడిపదును కత్తి కాదు.

శ్రీ బి.యన్. రెడ్డిగారి కవితలు చదివిన పిమ్మట - సహృదయుడు సంస్కారవంతుడు కాగలడు. "చెప్పులు లేవని ఏడ్చేవానికి కాళ్ళు లేని వాడు కనిపించే వరకు తానెంతటి అదృష్టవంతుడో అర్థం కాలేదట". "నేటి సినీమా సగం ముద్దులాట సగం గుద్దులాట" అనగలడు. ఈ కవియుగంలో కల్తీలేని సరుకు లేదట ఒక స్వార్థం తప్ప! "కుంభవర్షం కురిసినా బోర్లించిన కుండలో నీరు నిలవనట్లే ఆత్మవిశ్వాసం లేనివాడు విశ్వమంతా తిరిగినా వీసమెత్తు సాధించలేడు" ఈ కవి వేదాంతి అనుష్ఠాన వేదాంతి. జీవితంలో "దైవం"పాలు ఎంత? "పురుష కారం" పాలు ఎంత? జీవితం చీట్లపేకాట వంటిది. ఆటలో నేర్పు పురుషకారం. చేతికి అందే పేకముక్కలు దైవం! రెంటి సమ్మేళనం మానవ జీవితం అని శ్రీ రెడ్డిగారి తీర్పు. శ్రీ రెడ్డిగారు సమన్వయ వేదాంతి.

బతుకు పాలకడలి మెదడుతో కుదియించి
అమృత రసగుళికలనంద చేసె
వాస్తుశిల్పి రెడ్డి వాఙ్మయశిల్పియై
కోకిలమ్మ గంగిగోవు కలిపె.

డా॥ నందూరి రామకృష్ణమాచార్య
అధ్యక్షులు, అధికార భాషాసంఘం

# కృతజ్ఞతలు

నా వచన కవితలను ప్రచురించి ప్రోత్సహించిన ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ వారపత్రిక సంపాదకులకు, "బి.యన్. భాషితాలు" పై తమ తమ అమూల్య అభిప్రాయాలను వ్రాసిన సర్వశ్రీ ఆవుల సాంబశివరావు, డా. సి. నారాయణ రెడ్డి, డా. తూమాటి దోణప్ప, డా. నందూరి రామకృష్ణమాచార్య, శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ, శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు, డా. ఉండేలమాల కొండారెడ్డి గార్లకు - ఈ భాషితాలు అప్పుడప్పుడు వింటూ, తగిన సలహాలందిస్తూ వచ్చిన మిత్రులు శ్రీ ఎల్లోరా, డా. ముకురాల రామారెడ్డి, చిత్రకారులు శ్రీ చిదంబరం పవన్ గార్లకు ఈ పుస్తక ముద్రణకు తోడ్పడిన చెరిష్మా ప్రింటర్స్ వారికి, ప్లానోగ్రాఫర్స్ వారికి, జనరల్ ప్రింటర్స్ వారికి ఈ భాషితాలను పుస్తక రూపంలో వెలువరించటంలో సహకరించిన "యువకళావాహిని" మిత్రులు శ్రీ వై.కె. నాగేశ్వరరావు, శ్రీ పి.వి.యల్. నరసింహారావు, శ్రీ జి. సత్యనారాయణ, శ్రీ పాడేటి జాన్సన్, శ్రీ సాయికుమార్, జి. వెంకట రెడ్డి మిత్రులకు అందరికీ నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

హైదరాబాదు
21.6.1988

వాస్తుశిల్పి
— బి.యన్. రెడ్డి





## ఆత్మజ్యోతి

నవ రంధ్రముల దేహంలో
ఒక జ్యోతి ప్రకాశిస్తున్నది
ఆ ఆత్మజ్యోతిని దర్శించు
ఆత్మసాక్షాత్కారం సంపాదించు

## ఆత్మవిశ్వాసం

కుంభ వర్షం కురిసినా
బోర్లించిన కుండలో నీరు
నిలవనట్లే
ఆత్మవిశ్వాసం లేని వాడు
విశ్వమంతా తిరిగినా వీసమెత్తు
సాధించలేడు





## జీవితం

జీవితం ఒక "చీట్ల పేకాట"లాంటిది
చీట్లు మంచివి వచ్చినా ఆట రాకపోతే
ఓడిపోతాం
ఆట వచ్చినా చీట్లు మంచివి రాకపోతే
ఓడిపోతాం
ఆట వచ్చినవాడికి చీట్లు కలిసి
రావడమే "అదృష్టం"



## జీవిత సత్యాలు

ఎంత సంపాదించినా ఒకనాడది
వదలి వెళ్ళాల్సిందే
ఎంతకాలం కలిసివున్నా చివరకు
విడిపోవల్సిందే
ఎంతకాలం జీవించినా ఒకనాడు
మృత్యు వాత పడాల్సిందే
నీవెంత పైకెదిగినా యీ జీవిత
సత్యాలను అనుభవించాల్సిందే





## దేవుడు

అర్భకుడైన బిడ్డకు తల్లి సమస్తం
సమకూర్చినట్లే
కష్టపడి కార్యములు సాధించు
కర్మయోగి కంటే
భారమంతా భగవంతునిపై వదిలేసిన
భక్తునికి
అన్నీ అనుగ్రహిస్తాడట ఆ దేవుడు !

## ధ్యేయం

తలచిన పని తలచినట్టుగా కాలేదని
తలపట్టుకొని కూర్చుంటే
అవుతుందా?
తల తాకట్టు పెట్టో తలనీలాలిచ్చో
సాధించాలి నీ ధ్యేయం







## గమ్యంచేరుకో



ఎండకు కండువా కప్పుకో
వర్షంవస్తే ఛత్రం విప్పుకో
దుష్టుడు కనిపిస్తే ప్రక్కకు తప్పుకో
చివరకు నీ గమ్యం చేరుకో



## యజ్ఞం

యజ్ఞం వలన వృష్టి కలుగును
వృష్టి వలన అన్నం కలుగును
అన్నం వలన పుష్టి కలుగును
అందుకే యజ్ఞం చేయవలెను.





## జ్ఞాపకముంచుకో

ఈ డబ్బు ఈ ఆస్తి నీది కాదు
గుమస్తా మంచితనం చూసిన
యజమాని
తన ఖజానా తాళాలు
గుమాస్తాకిచ్చినట్లే
నీ పూర్వజన్మ సుకృతం వలన
నీకు దైవం కట్టపెట్టిన పట్టం ఇది !

## తస్పాదీయ

ఈ డబ్బుతో మహా కష్టం
సంపాదించడం కష్టం - ఖర్చు
పెట్టడం కష్టం
దాచుకోవడం అంతకంటే కష్టం
తస్పాదీయ ఇది వుంటే కష్టం
లేకపోతే కష్టం!









## ఒకడుచాలు

కష్టాలెన్ని వచ్చినా
నష్టాలెన్నో భరించినా
కన్నీళ్ళు తుడ్చే అప్పుడు
కనీసం ఒకడుంటే చాలు



## కర్మఫలం

బంగారు లేడి వెంట పడి భార్యను
కోల్పోయాడు రాముడు
కౌరవులతో జూదమాడి ద్రౌపదిని
ఓడినాడు ధర్మజుడు
బంగారు లేడి వుండదనీ - భార్యను
ఫణంగా పెట్టకూడదనీ
ఆ మహానుభావులకు తెలియకనా
వారి ఖర్మ కాకపోతే



## జోడు విలువ

బావి ఎండిపోయిన తర్వాత
నీళ్ళ విలువ తెలుస్తుంది
తోడు బోయిన తర్వాత
జోడు విలువ తెలుస్తుంది!

## శవం నవ్వింది

వెనకాల వెక్కి వెక్కి ఏడుస్తూ
నడుస్తున్న
బంధుమిత్రులను చూసి ఓ శవం
నవ్విందట
రేపో మాపో తన దారిలోనే
రావల్సిన యీ పిచ్చివాళ్ళంతా
పాపం! వారుమాత్రం
పర్మనంటను
కుంటున్నారేమోనని -







బి.యస్. భాషితాలు

## ఇక సుఖమెక్కడిది?



డబ్బుంటే పవర్ కావాలి
పవర్ కావాలంటే పాలిటిక్స్‌లో
చేరాలి
డబ్బుండి పవర్ లేకపోతే అన్నం
కొందరికి రుచించదు
పవరుండి డబ్బు రాకపోతే
మరికొందరికి నిద్రపట్టదు



## ఇదా పుణ్యం !

ఆకలితో నకనకలాడిపోతున్నాను
ఇంత అన్నం పెట్టు తల్లీ అని అర్థిస్తే
రేపురా బాబూ పరమాన్నం పెడ్తాను
అన్నదట ఓ పుణ్యాత్మురాలు !



## ఇదీ లోకం

పది ఇస్తే పరమ మిత్రుడు
వంద ఇస్తే పరమ పూజ్యుడు
వేయి అడిగినపుడు ఇవ్వలేకపోతే
ఆ పరమ పూజ్యుడే పరమ
దుర్మార్గుడు

---



## ఇదీ వరస

నేను గట్టిగా శ్వాస పీలిస్తేనే
ఆగ్రహంతో అగ్గి బుగ్గయి
పోతున్నారు
ఎదుటివాడు హత్యచేసినా
పట్టించుకొనే నాథుడు లేదు

---









## పునాది

ప్రభుత్వ యంత్రాంగంలో
పని చేసే ప్రతి సోదరుడు
చెట్టుకు వేరులాంటి వాడు
ఇంటికి పునాది లాంటి వాడు



## ఆనంద ఘడియ

అందమైన వస్తువును చూసినపుడు
కమ్మని సంగీతం విన్నపుడు
ఆత్మీయులను అనుకోకుండా
కలసినపుడు
డెందం ఆనంద డోలికలలో
తేలిపోవునపుడు





## అర్థం కాలేదట

చెప్పుల్లేవని ఏడ్చేవాడికి
కాళ్ళులేని వాడు కనిపించేవరకు
అర్థంకాలేదట తానెంతటి
అదృష్టవంతుడో !

## జాగ్రత్త

నడిరోడ్డులో నడిచే స్వేచ్ఛాజీవీ
నీ వెనుక వచ్చే స్కూటరువాడు
నీలాగే స్వేచ్ఛను కోరుకుంటే
నీ నడ్డి విరుగుతుంది భాయీ!





## కావలసింది

ప్రజలకు కావల్సింది
నీ తెలివితేటలు కాదు
నీ సిరిసంపదలు కావు
నీలోని మంచితనం




## గమనించన్నా

అష్ట ఐశ్వర్యములున్నా
అనంతమైన శక్తి సామర్థ్యములున్నా
అంతఃకరణశుద్ధి లేకపోతే
శృంగభంగము తప్పదన్నా





## పెద్దల తరహా

ధన ధాన్యములు సంపాదించి
ధనాగారములు నింపు పెద్దలు
దానధర్మములు చేయరు
పెద్ద పెద్ద వాగ్దానాలు. చేస్తారు

## ప్రగల్భాలు

నేను వీరుణ్ణి శూరుణ్ణి అని
విర్రవీగకు
కరెంటులేని రాత్రి నాల్గు దోమలు
చాలు
తెల్లవారే సరికి నీ భరతంపట్టి
నీ అవతారాన్నే మార్చివేయడానికి!









## పుణ్యాత్ములు

ప్రాణం పోతున్న జీవికి గంగా
జలమిచ్చి
పుణ్యం కట్టుకోవాలనుకుంటున్నారు
పాపం!
బ్రతికుండగా గుక్కెడు
మంచినీళ్ళిచ్చిన
పాపాన పోలేదీ పుణ్యాత్ములు !



## పెద్ద పదవిలో

పెద్ద పెద్ద పదవుల్లో వున్నవారికి
బాగా డబ్బు సంపాదించిన వారికి
వందిమాగధులు వంతలు పాడేవారు
దగ్గరవుతారు
నిజమైన స్నేహితులు
దూరమవు తారు





## ఫలత్యాగం

తప్పు చేయని మనిషి లేడు
దోషరహితమైన కార్యం లేదు
అందుకే కర్మసన్యాసం కాదు
కర్మఫల త్యాగం చేయమన్నాడు
కృష్ణుడు!



## పని

ఆడుతూ ప్రారంభించిన పని
పాడుతూ పూర్తిచేశాడు
అన్నిటికీ అనుమానపడే పక్షి
ఏమీ సాధించలేక పోయాడు







## ప్రతికూలత

పనిలో ప్రతికూలత వచ్చిందని
ఆ పనికి తిలోదకాలిస్తే ఎలా?
గాలి ప్రతికూలంగా వున్నపుడే కదా
గాలిపటం బాగా ఎగిరేది అలాఅలా!



## బ్రతుకంతా భయం

బీదవాడి గుడిసె గాలివానకు
ఎగిరి పోతుందేమోననే భయం
ధనవంతుడి భవనం ఇన్‌కంటాక్సు
బాకీలకింద పోతుందేమోననే భయం





## ఆశాకిరణం

ఏ దిశను అంధకారం ఆవరిస్తుందో
ఆ దిశనుండే ఆశాకిరణం
ఉదయిస్తున్నది
ఎక్కడ తారలు అస్తమిస్తున్నవో
అక్కడి నుండే
సూర్యుడుదయిస్తున్నాడు.

## కాలం

కాలం విలువ తెలిసినా
తెలియకపోయినా
కాలంతోపాటు పరుగెత్తుతూనే
వున్నాం
జీవితంలో ఏమీ సాధించకపోయినా
పాపం పోనీ అని బ్రతుకుతూనే
వున్నాం!







## మనసు - అద్దం



నీ మనసు ఒక అద్దంలాంటిది
నీ అంతరాత్మ ఒక జ్యోతిలాంటిది
ఆ అద్దంలో చూసి నీ తప్పులు
దిద్దుకో
ఆ జ్యోతి వెలుగులో నీ మార్గం
తెలుసుకో



## మనస్తత్వం

మనిషి మనస్తత్వం మహా
విచిత్రమైనది
కార్యం సాధిస్తే తన కార్యదీక్షే కారణ
మంటాడు
అందులో ఏమైనా అపజయం కలిగితే
మాత్రం
ఆ దయామయుడి దయ
లేదంటాడు





## పరుగు పందెంలో

జీవితమనే పరుగు పందెంలో
బోల్తాపడేలా పరుగెత్తకు
ఎంత దూరం పరిగెత్తినా
చివరి పరుగు సమాధివరకే!

## పాపమాతడు

సమాజంలో మంచి మార్పు
రావాలని
పాపమాతడు ఎంత
ప్రయత్నిస్తున్నాడో
కానీ చుట్టూవున్న కోతులు కొండ
ముచ్చులు
అతని చిలుక పలుకులు
వింటాయా!







## మహాత్ముడు



సంతోషంలో నవ్వవు
కష్టంలో కన్నీరు పెట్టవు
నీవు మామూలు మనిషివి కావు
మహాత్ముడివేమో తెలియదు



## నేర్పు - ఓర్పు

తీర్పు చెప్పేవాడికి
నేర్పు అవసరం
పాఠం చెప్పేవాడికి
ఓర్పు అవసరం





## ఏమి చిత్రమో!

ఎక్కడెక్కడో పడుతున్న వర్షం
అదేమి చిత్రమో నా పెరట్లో
పడదు
ఎవరెవరినో వరిస్తున్న అదృష్ట దేవత
నా అదృష్టమేమో నన్ను వరించదు!

## ఒకటి-రెండు



ఒక చెంప మీద కొట్టినపుడు
మరో చెంప చూపమన్నారు పెద్దలు
ఆ సూత్రం పనిచేయనపుడు
కొట్టినవాడి
రెండు చెంపలు వాయగొట్టడమే
న్యాయం !

## మండేగుండె

మధుశాలలో కూర్చుని మధుపానం
చేయడం లేదు
కష్టాలు తలుచుకొని కన్నీళ్ళు త్రాగు
తున్నాను
మధుపాత్ర ఖాళీచేసి మాంస భక్షణ
చేయడం లేదు
మనోవ్యధతో మండేగుండెను వేపుకు
తింటున్నాను





## భార్యాబాధితుడు

నేను చచ్చి తిన్నగా స్వర్గానికే వెళ్తాను
సందేహం లేదని అన్నాడట
జీవితమంతా నరకయాతన
అనుభవించిన ఓ భార్యాబాధితుడు






## కల్తీ

బియ్యంలో కల్తీ నెయ్యిలో కల్తీ
ఉప్పులో కల్తీ పప్పులో కల్తీ
ప్రాణదానం చేసే మందులో కల్తీ
అసలు వీళ్ళ బతుకులే కల్తీ

## కల్తీలేని స్వార్థం

కల్తీ-కల్తీ-కల్తీ
ఎటు చూసినా కల్తీయే
కల్తీలేని-నికారసైనదొక్కటే
స్వార్థం-స్వార్థం-స్వార్థం








## డబ్బు

ఈ డబ్బు మహాపాపిష్టిది
అవసరాని కంటే ఎక్కువ
కూడపెడితే
అది నిన్ను ముప్పుతిప్పలు పెట్టి
మూడు చెరువుల నీళ్ళు
తాగిస్తుంది




## డాబుసరి

ప్రపంచంలో అందరూ హాయిగా
బ్రతుకుతున్నారు కానీ,
నీ వొక్కడివే సమస్యలతో
సతమతమౌతున్నావా?
పైకి డాబుసరిగా కనపడే కొందరు
బాబులకు
ఎన్ని సమస్యలో నీకు తెలిస్తే
నీ గుండె ఆగిపోతుంది





## నిండుతనం

సభలో మధురంగా పాడే ఆ
మధురగాయని
ఏకాంతంలో ఎంత దుఃఖిస్తుందో!
నిండుగా కన్పించే ఆ వ్యక్తిలో
ఎంత విషాదం దాగివుందో !

## నిరాశ చెందకు

సమాజంలోని మాలిన్యాన్ని
నిర్మూలించడానికి
నీకున్న సామర్థ్యం చాలదని
నిరాశచెందకు
కొవ్వొత్తి ఒకటి చాలు కొండంత
చీకటిని పారద్రోలి
వెలుగును ప్రసాదించడానికి !







## తెలియదు పాపం

హంతకుడు రక్తసిక్తమైన తన
హస్తాలను ఎంత శుభ్రంగా కడిగినా
పాపం అతనికి తెలియదు
ఆ రక్తం మాట్లాడుతుందని !





## దప్పిక తీరదు

ఆకలి అవుతుందని అడ్డంగా తింటే
అనారోగ్యం చేసి ఆస్పత్రిపాలు
అవుతావు
బాగా దప్పిక అయితే మంచినీళ్ళు
త్రాగాలి కానీ
బావిలో దూకితే ప్రాణమే
పోతుంది!





## దరిద్రనారాయణీయం

ఇహపరాల గురించిన చర్చలతో
ఇందుగల డందుగలడనే దండకంతో
దరిద్రనారాయణుల కడుపులు
ఎలా నింపగలము?

## దానం

పది రూకలిచ్చి పదిసార్లు
చెప్పుకుంటారు
దానం చేసే విధానంలోని ప్రథమ
సూత్రం తెలియదు కాబోలు
కుడి చేయి చేసిన దానం
ఎడమ చేయికి తెలియకూడదని!







## అలా చేయకండి



అయిన వాడి కొరకు
కానివాడిని కష్టాలపాలు చేయకండి
ఒకడి బాగు కొరకు మరొకడి
భవిష్యత్తును బలి చేయకండి

## అల్పసంతోషి




ఆడపిల్లల నల్లరిపెట్టే
అల్పసంతోషీ!
ఆ అమ్మాయి సాహసిస్తే నీ చెంప
ఛెళ్ళుమంటుంది
పోలీసువాడు చూస్తే
నీ వీపు బ్రద్దలవుతుంది.





## అలసట

శారీరక బడలిక వల్ల రాదు జబ్బు
మానసిక రుగ్మతవల్ల వస్తుంది
ఎన్ని మైళ్ళు నడిచినా ఎన్ని గంటలు
శ్రమించినా
అనుకున్న పని అయితే
అలసటెక్కడిది?

## అన్నీ పోగొట్టుకుంటాం

హంగామా చేస్తే పని
అవుతుందనుకుంటాం
బెదిరిస్తే ఎదుటివాడు
పారిపోతాడనుకుంటాం
కోర్టుకెళితే న్యాయం
జరుగుతుందనుకుంటాం
చివరకు అప్పులపాలై అన్నీ
పోగొట్టుకుంటాం









## అనుబంధం

నీకూ నాకూ ఏ అనుబంధంలేదని
నీ వంటున్నావు కదా!
నీ కళ్ల నుండి ఎందుకలా
అశ్రుధారలు ప్రవహిస్తున్నవి మరి?



## అన్నం పెట్టే చేయి

అందరికీ అన్నం పెట్టేది ఆ
అదృశ్యశక్తే అయినా
మధ్య దళారీలు సగం జనాభాను
మలమల మాడ్చేస్తున్నారు
ఆ పని కూడా యీ పాపిష్టి
మనుషుల చేతుల్లోనే వుంటే
మొత్తం జనాభాను మాడ్చి
చంపగల రేమో!





## అడియాసలే

ఆశంతో పుడుతున్నాం
ఆశంతో చస్తున్నాం
మధ్యకాలంలో ఒకటి
రుజావు చేస్తున్నాం
ఈ ఆశలన్నీ అడియాసలే అనీ !

## అద్భుతమైన గుణం

మనిషి మనస్సు బహుచిత్రమైనది
అన్నీ అనుభవించి తీరాలంటుంది
కానీ
దీనికో అద్భుతమైన గుణమున్నది
ఏవి అలవాటుచేస్తే అవే
కావాలంటుంది







## అసూయపడకు



ఎదుటివాడి బాగుచూసి
అసూయపడకు
భగవంతుడు నీకూ ఇస్తాడు
నిరాశపడకు



## ఆరోగ్యమే మహాభాగ్యం

సగం కడుపుకు తినాలి
కంటి నిండా నిద్రపోవాలి
రెట్టింపు నీరు త్రాగాలి
నాలుగు రెట్లు నవ్వాలి





## తండ్రి - కొడుకు

చిన్న పిల్లాడిని వూరికే కొట్టొద్దురా
అన్నాడట తండ్రి తన కొడుకుతో
నా బిడ్డను హద్దులో పెట్టుకునే హక్కు
నాకు లేదా అన్నాడట
కొడుకు తండ్రితో
నా కొడుకును హద్దులో పెట్టే
హక్కు నాకు లేకుండా
పోయిందన్నాడట ఆ తండ్రి
ఆవేదనతో

## తప్పా?

ఒక్క భార్య వున్న మగధీరుడే
వందసార్లు పెళ్లాం గడ్డం
పట్టుకుంటుంటే
అష్టభార్యలున్న కృష్ణుడు
ఒకసారి సత్యభామ కాలు
పట్టుకుంటే ఏం?







## కీకారణ్యం



నడుస్తున్నా విచిత్రవిచిత్ర మనుషుల
కీకారణ్యంలో
కష్టనష్టాల కెరటాల తాకిడిని
తట్టుకుంటూ
ఈ కాస్త కష్టసుఖాలను చవిచూడని
జీవితం
పంచదారలేని పాయసంలా
వుంటుందేమో!




## వెళ్ళేరోజు

నీవు పుట్టిన గడ్డమీద ఓ
మంచిపని చేసి వెళ్ళిపో
నానాగడ్డి కరిచి సంపాదించినా
విడిచివెళ్ళే రోజు రాకతప్పదెలాగో!





## ఋణం

ఆ జన్మలో సహగమనం చేసిన
సహ ధర్మచారిణి ఋణం
ఈ జన్మలో తీర్చుకుంటున్నాడు
కాబోలు
అగ్ని సాక్షిగా పెళ్ళాడిన సతిని
అగ్నికాహుతి చేసి!

## అన్యాయం!

ఎవడో అన్యాయం చేశాడని
ఏడిస్తే ఏం లాభం?
చరాచర జగత్తును సృష్టించిన
మహానుభావుడే
నరరూప రాక్షసులను సృష్టించి
తమాషా చూస్తుంటే!







## ఘాటుపోటు

మనిషి ముందర ఓ తీయని మాట
మనిషి వెనుక ఓ ఘాటు పోటు
ఈ మాటలే పోటులై నీ భరతం
పడ్తే
పుట్టగతులుండవు భారత పుత్రా !





## చావడం సులభమా?

జీవితంలో కష్టాలు భరించలేక
చావును కోరుకున్నాను
మృత్యువొచ్చి ముంగిట నిలిస్తేకానీ
అర్థం కాలేదు చావడమెంత
కష్టమో!





## చావు - పుట్టుకలు

ఒక శ్వాస పోవడం
ఒక శ్వాస రావడం
చావు - పుట్టుకల
రహస్యమంతా ఇంతే

## చావుపుట్టుకలు

మనిషి పుట్టి కష్టాల పాలవుతున్నాడు
చచ్చి ఆ కష్టాలకు దూరమవుతున్నాడు
అయినా పుట్టినపుడు సంతోషిస్తున్నాం
చచ్చినపుడు - ఏడుస్తున్నాం







## నూట ఒక్క దెబ్బ




రాయిని పగలగొట్టేవాణ్ణి చూడండి
ఎంత నిబ్బరంతో ఎన్నిదెబ్బలు
కొడ్తున్నాడు
నూరు దెబ్బలకు పగలని రాయిని
నూట ఒక్క దెబ్బకు పగులగొట్టి
చూపిస్తాడు



## నోరుజాగ్రత్త

అయినచోట - కానిచోట
నోరు పారేసుకోవద్దు మిత్రమా!
నీ చుట్టూ నీవాళ్ళు తక్కువ
నీవంటే గిట్టని వాళ్ళెక్కువ





## ఆత్మ ధైర్యం

కష్టాల కడలిలో కన్నీళ్ళు త్రాగడం
నేర్చుకో
నిరాశా నిస్పృహల నివారణకు
ఆత్మధైర్యం పెంచుకో
యీ ప్రపంచంలో కొంతకాలం
మనిషిగా బ్రతకాలనుకుంటే
ప్రాణభీతిని విడిచి ప్రతి నిమిషం
పరిస్థితులతో పోరాడటం నేర్చుకో

## జీవిత రహదారిలో

నీ వొకనాడు నా కింత అన్యాయం
చేస్తావని
కలలో కూడా వూహించలేదు
ఏకాకిని చేసి నన్నిలా జీవిత
రహదారిలో
అకస్మాత్తుగా వెళ్ళిపోతాననుకోలేదు







## దీపం మాట్లాడదు

దీపం మాట్లాడదు వెలుగునిస్తుంది
లైట్ హౌస్ కేకపెట్టదు దారి
చూపిస్తుంది
మనసున్న మనిషి ప్రగల్భాలు
పలుకడు
పున్నమి వెన్నెలలా ప్రేమానురాగాలు
పంచుతాడు





## దూషిస్తున్నావు?

ఎందుకు బాబూ నన్ను
అంతగా దూషిస్తున్నావు
నాకు తెలిసి నీకెప్పుడూ
సాయం చేసినట్టు లేదే!





## చిత్రసీమ

చిత్రసీమలో చిత్రాలసంఖ్య పెరిగింది
కళాత్మక విలువ తగ్గింది
చిత్రం పొడుగునా రెండుగంటలు
సగం గుద్దులాట - సగం ముద్దులాట!

## స్టైయిలు

పిన్నవయసు లో చినిగిపోయిన
బట్టలు వేసుకొని
కొత్తపుస్తకాలు పట్టుకొని స్కూల్
కెళ్ళే వాళ్ళం సింపుల్ గా
వయస్సు వచ్చిన తరువాత
కొత్తబట్ట లేసుకొని
చినిగిన పుస్తకాలు తీసుకొని కాలేజీ
వెళ్తున్నాం స్టైయిల్ గా!







## ఆలోచించు

లోకం నన్ను గుర్తించలేదని
వూరికే బాధపడేకన్నా
లోకాన్ని నేను అర్థంచేసుకున్నానా
అని ఆలోచించడం మిన్న!






## స్వర్గానికి నిచ్చెన

క్రమం తప్పకుండా క్లబ్బుకెళ్ళడం
చూసిన స్నేహితులు
నన్ను మందలిస్తే నాలో నేనే
నవ్వుకున్నాను
నేను స్వర్గానికి నిచ్చెన
వేసుకుంటుంటే
పాపం చూడలేక పోతున్నారేమోనని!





## తూచి చూడు

నీ జీవితాన్ని తూచి చూడు
నీవు పనిచేసే త్రాసులో
ఎంతకాలం చేశావనేది కాదు
ఎంత సాధించావనేది ముఖ్యం!

## తెలుసుకో

నీవు నాటిన కొమ్మ వటవృక్షంగా
మారి
వందమందికి నీడనిస్తుంది
నీవు నిర్మించిన ఆకాశహర్మ్యం
వంద కుటుంబాలకు
ఆశ్రయమిస్తుంది
నీవు నాటిన విషబీజం సమాజంలో
చిచ్చుపెట్టి
వందలమంది ప్రాణాలు తీస్తుంది









## చిరునవ్వు

సిరులు వెదజల్లు ఒక చిరునవ్వు
తేనెలొలుకు ఒక చిన్న పలుకు
మురిపించు నెంత ముభావినైనా
కరిగించునెంత కఠినాత్మునైనా!



## చివరి ప్రయాణం

జీవితం పొడుగునా
నా కష్టాలు కన్నీళ్ళు ఎవరు భరిస్తారు
నా ప్రాణం కూడా వెళ్ళిపోయింది
చివరికి
నా కష్టాలు చూడలేక





## ఎవరిని నమ్మాలి!

నేనెవరిని నమ్మాలి
ఎవరి వెంట వెళ్ళాలి
ఇస్త్రీ దుస్తులు వేసుకున్న
ప్రతివాడూ
మార్గదర్శకుణ్ణే అంటున్నాడు!

## ఎవరు మొద్దు

నీవొక మొద్దు సన్నాసివి
నీకు చస్తే చదువురాదని
నిరుత్సాహపరిచే అధ్యాపకుడు
ఎంత బుద్ధిమంతుడో చెప్పండి







# ఇదే మిగిలింది

ఆరు పదులు నిండిన నేను
పెద్దగా సాధించిన దేముంది?
ఒక్క అడుగు ముందుకు వేస్తే
రెండడుగులు వెనక్కి వేశాను





# ఇలాంటి గురువు

విద్యార్థులను హద్దులో పెట్టలేదు
అడిగిన ప్రశ్నకు సమాధానం
చెప్పలేదు
ఇలాంటి గురువు మరి ఎలాంటి
శిష్యులను తయారు చేయగలడు?





## లోకం పోకడ

దానం చేస్తే గొప్ప కోసమంటారు
చేయకపోతే పిసినారంటారు
ముందు నుయ్యి వెనుక గొయ్యి
యీ లోకుల నోళ్లు-వెయ్యి !



## లక్ష్యం

లక్షణంగా పెద్ద చదువులు
చదువుకోవాలన్నా
సలక్షణమైన ఉద్యోగం కావాలన్నా
లక్షలకు లక్షలు సంపాదించాలన్నా
లక్ష్యమనేది ఒకటుండాలన్నా!





## ఎంత కఠినుడవు

కట్టుకున్న భార్య మృత్యువు కళ్ళారా
చూశాను
కన్న బిడ్డల కష్టాలు చూడలేకున్నాను
స్వామీ నీవెంత కఠినుడవు?
కనీసం చావైనా సమయం మీద
ఇవ్వరాదా!





## ఎంత ప్రేమో!

నా స్నేహితులకు నా మీద
ఎంత ప్రేమో పాపం
బాగా ప్రాగించి నన్ను
బజారులో నిలబెట్టారు





## మోక్షం

మోక్షం మోక్షం అని
కలువరిస్తావెందుకు
మోక్షం ఎక్కడో లేదు
ప్రాపంచిక విషయాలపై మోజు తగ్గి
నీ ప్రవృత్తికి నివృత్తి కలిగితే అదే
మోక్షం!

## మైకం

భయభక్తుల్లేకుండా త్రాగి
బజారులో నాట్యంచేసే బ్రదర్
కారునడిపే మరో సోదరుడు నీలాగే
త్రాగిన మైకంలో వుంటే
నీ ఎముకలు పిండి కాగలవు
నీ భార్యా పిల్లల బ్రతుకులు
బండలు కాగలవు









## మనోవ్యధ

ఎన్నిరోజుల నుంచి త్రాగుతున్నాను
ఎన్ని సీసాలు ఖాళీ చేశాను
నా పిచ్చి కానీ
త్రాగితే పోయేదా ఈ మనోవ్యధ?




## మాట - మూట

'మాట' పోయినా ఫర్వాలేదు
'మూట' పోవద్దు
పరువు పోయినా ఫర్వాలేదు
ప్రాణం పోవద్దు!






## మిగిలేది అంతే

ని ఆస్తి ని కొడుకులు కొట్టేసిరి
ని డబ్బు ని కూతుళ్ళు కాజేసిరి
ని సమాధి వరకు వచ్చిన
బంధుమిత్రులు తిరిగి ఇంటికెళ్ళిరి
నీకు మిగిలింది ని మంచి-చెడు
అంతే !

## మూన్నాళ్ళ ముచ్చట

మూన్నాళ్ళ ముచ్చట ఈ జీవితం
ఎందుకింత మిడిసిపడటం?
మహామహులనే మరిపించిన ఈ
ప్రపంచంలో
నీవెంత-నీ బ్రతుకెంత?









## ఖాళీ

కడుపుబ్బునటుల లడ్డూలు తిని
కడుపు నొప్పితో బాధపడుతున్న
భోజన ప్రియుడికి
డాక్టరుగారొక మందు గోలివ్వగా
గోలిపట్టే ఖాళీవుంటే మరో
లడ్డుపట్టించే వాణ్ని అన్నాడట !



## ఇద్దరు మిత్రులు

ఆతిథ్యమున కెళ్ళిన ఇద్దరు
మిత్రులకు
ఆదరణతో ఆ ఇంటి ఇల్లాలు ఇచ్చిన
పానీయాన్ని
ఒకడు అది అదృష్టమని భావించి
సేవిస్తే
మరొకడు అది పులిసిపోయిందని
మూతి విరిచాడట !





## మనిషి

వచ్చేటప్పుడు గోచీ లేకుండా వచ్చి
పోయేటపుడు అడ్డసు లేకుండా
పోయే మనిషి
మధ్యకాలంలో ఎంత హంగామా
చేస్తున్నాడు
ఎంతమందికి ఎన్ని సమస్యలు సృష్టి
స్తున్నాడు!

## మనిషీ!

ఓ మనిషీ! పృథివి గర్వించదగిన
అవతారానివి నీవు
తెలివితేటలు, శక్తియుక్తులు పుణికి
పుచ్చు కొని పుట్టావు
కొండలను పిండికొట్టగలవు - నదీ
జలాలదారులు మళ్ళించగలవు
స్వయంకృషితో నీ జన్మభూమిని
స్వర్గ సీమగ మలచుకోలేవా?







## కవిత్వం

హృదయం స్పందించేలా
ఆత్మవికసించేలా
జనసామాన్యానికందేలా
సాగించు నీ కవితా గానం





## పాపం!

జీవించినంతకాలం నాపై
రాళ్ళు వేసిన యీ ప్రపంచం
కళ్ళ కద్దుకుంటున్నది నా
మృతదేహాన్ని
నెత్తిన పెట్టుకొని మోస్తున్నది నా
శవాన్ని!





## కాకి కోయిల

కాకీ పక్షే - కోయిలా పక్షే
నోరువిప్పితే తెలుస్తుంది ఏది ఏదో!
రాముడూ మనిషే - రంగడూ
మనిషే
మాట్లాడితే తెలుస్తుంది ఎవరేమిటో!

## కార్యోన్ముఖుడు

కష్టం చేయకుండా క్రమశిక్షణ
లేకుండా
ప్రపంచంలో ఏది సాధించాలన్నా
కష్టమే
ధనలక్ష్మి కావాలన్నా, జయలక్ష్మి
కావాలన్నా
కార్యోన్ముఖుడవై కర్తవ్య పాలన
చేయాలన్నా









## చితి - చింత

అయిన దానికి కాని దానికి
అదే పనిగా చింతించవలదు
మిత్రమా
చితి - చనిపోయిన మనిషిని
కాల్చి వేస్తే
చింత - బ్రతికున్న మనిషినే
కాల్చి వేస్తుంది



## చిత్రం

ఇరవై యేళ్ళ కుర్రాడొకడు
అరవైయేళ్ళ ఆరిందాలా
మాట్లాడుతుంటే
అరవైయేళ్ళ ముసలాడొకడు
పదేళ్ళ పసివాడిలా ప్రవర్తిస్తుంటాడు





## ఎక్కువ-తక్కువ

నేటి మేటి మీటింగుల్లో
నిజాలు తక్కువ, నినాదాలు ఎక్కువ
యీనాటి గానసభల్లో
గానం తక్కువ బజానా ఎక్కువ

## త్రాగనని ఒట్టు



నేనిక త్రాగనని ఒట్టు పెట్టుకుని
త్రాగే గ్లాసు పగులగొట్టాను కానీ
పగిలిన ఆ గ్లాసు ముక్కలు పక్కున
నవ్వినవి
నా చేతిలో మరో నిండు గ్లాసును
చూసి







## ఏం మనిషి?

మనిషిలోని మంచితనాన్ని గుర్తించి
అప్పుడప్పుడు అభినందించాలి కానీ
ఎప్పుడు చూసినా ఎదుటివాడి
చెడు గురించి
ఏకరువు పెట్టే మనిషి - మనిషా?



## ఏదీ ఆగదు

ఎవరెన్ని అవరోధాలు కల్పించినా
ఏది ఆగదు
జరుగవలసిన దేదైనా ఆ పైవాడి
ఆజ్ఞలేనిదే జరగదు





## బాగుపడేదెలా?

ఇంటి ఇల్లాలుకు ఆభరణాలపై మోజు
యజమానికి క్లబ్బులో పేకాట మోజు
పిల్లకు సినిమాలు, టీవీలపై మోజు
ఈ మోజులతో ఆ సంసారం
బాగుపడేదేరోజు?

## ఖరీదైన బాబూ



కారులో ప్రయాణం చేసే ఖరీదైన
బాబూ
ప్రమాద భరిత మీ జీవితం
రేసు కారులా దూసుకుపోకు
ప్రమాదాలు చేసి ప్రజల ప్రాణాలు
తీయకు!





## రెడీ క్యాష్!




రేపు అనేది ఒక ప్రామిసరీ నోటు
నిన్న అనేది ఒక చెల్లని చెక్కు
నేడు అనేదే నీ జేబులోని రెడీ క్యాష్
సద్వినియోగం చేస్తే లభిస్తుంది
శభాష్!



## లేదు

విద్యాలయాల్లో విద్య
నేర్చుకోడం లేదు
కార్యాలయాల్లో పని
నేర్చుకోడం లేదు
సంసార జీవితంలో సఖ్యత
నేర్చుకోడం లేదు
అన్నీ తెలుసుననే అహంభావంతో
ఏదీ నేర్చుకోడం లేదు





## పేదరికం

కష్టాలలో వున్న వాడిపై జాలిపడడం
పేదరికంపై ఉపన్యాసలివ్వడం
మహాసులభం
పేదరికాన్ని అనుభవించడం
పేదవాణ్ణి ఆదుకోడంమహా కష్టం

## విద్యుక్తధర్మం

నీ విద్యుక్తధర్మాన్ని నిర్లక్ష్యం చేస్తే
నీ పనివారే నిన్ను లెక్కబెట్టరు
నీ బంధుమిత్రులే నిన్ను
ఖాతరువేయరు
నీ భార్యా బిడ్డలే చిన్నచూపు
చూస్తారు !







## ముసలితనం



పనిలో నిమగ్నమై పట్టుదలతో
పనులు చేసేవారికి
ఆరోగ్యం చెడిపోదు
ముసలితనం రాదు



## పుణ్యక్షేత్రాలు

ఒక మేధావితో ఓగంట కాలక్షేపం
వందపుస్తకాలు చదివినదానితో
సమానం
ఒక సత్పురుషుడితో ఓ గంట
కాలక్షేపం
వంద పుణ్యక్షేత్రాల దర్శనంతో
సమానం —





## స్వార్థం

కాస్త స్వార్థమే లేకపోతే
మనిషికి మనుగడే లేదు
స్వార్థమే జీవిత పరమార్థమైతే
మనిషి లేదు–మనుగడ లేదు!

## హుం

కావాలని ఎంత ప్రార్థించినా
కావల్సిన వర్షం పడలేదు
వద్దుమొర్రో అని గోల పెడ్తుంటే
గడగడ వణికించే చలి మాత్రం
వచ్చింది









## సమయం - సందర్భం

సందర్భం కానప్పుడు
మాట్లాడకూడదు
సమయం కానప్పుడు
పోట్లాడకూడదు
ఇంట్లో మొరిగే కుక్కకున్న విలువ
బజారులో అరిచే కుక్క కెక్కడిది?



## స్వంతతెలివి

వయస్సుపైబడినవారు కొందరు
చెప్పిన మాటలు విని
చెడిపోతున్నారు
వయస్సులోవున్న యువకులు
కొందరు
స్వంత తెలివి నుపయోగించి
బాగుపడుతున్నారు





## వివేకం

చెప్పేవాడు చాదస్తం చెపుతుంటే
వ్రాసేవాడు వాస్తవాలు వ్రాయకపోతే
వివేకమున్నవాడెవడూ వినడు
ఇంగిత జ్ఞానమున్నవాడెవడూ
చదవడు!

## కాలం

నీవయసు తెచ్చిన యౌవనం
కష్టపడి సంపాదించిన ధనం
నీ చుట్టూ వున్న మందీమార్బలం
అన్నింటినీ హరించేస్తుంది కాలం







## లొంగుతారు

దష్టులు భయానికి లొంగుతారు
శిష్టులు ప్రియానికి లొంగుతారు
లోభులు డబ్బుకు లొంగుతారు.
ప్రశంసలకు అందరూ
లొంగుతారు



## నీదైన ఒక దారి

పదిమంది నడచిన రహదారిలో
నడిస్తే నీ ప్రత్యేకతేమున్నది
నీదైన ఒక దారిలో నడిచి
నీ దారిని రహదారిగా మార్చు





## గుండె జబ్బు

వచ్చిన కష్టం ఇక పోదని
భయపడితే
బండలాంటి వాడికైనా గుండె
జబ్బొస్తుంది
వచ్చిన కష్టం పోతుందని తెలిస్తే
ఎంతపెద్ద జబ్బైనా
పారిపోతుంది!

## గొప్పతనం

గొప్పలు చెప్పుకోడంలో లేదు
ప్రగల్భాలు పలకడంలో లేదు
చేసేపని ఏదైనా శ్రద్ధగా
చేయటంలో వుంది నీ గొప్పతనం







## పైవాడు

అయినవాళ్ళు దూరమైనంత
మాత్రాన
మనకు చావురాదు నిజమే కానీ
చచ్చేటంత బాధపెట్టి చంపకుండానే
చంపుతున్నాడే యీ పైవాడు!



## మూర్ఖుడు

నదిలో కొట్టుకుపోతున్న వాడొకడు
తదేక దీక్షతో దేవుని ప్రార్థిస్తూ
ఆ ప్రక్కనే వెళ్ళే పడవను
పట్టించుకోక ప్రాణాలు
పోగొట్టుకున్నాడు
స్వర్గాని కెళ్ళాక 'నిన్ను నమ్ముకుంటే
నన్ను నట్టేట ముంచావేమి స్వామీ'
అని అడిగితే
పంపించిన పడవను కాదని కళ్ళు
మూసుకుని జపం చేసుకునేంత
మూర్ఖుడ వనుకోలేదన్నాడట దేవుడు!





## వృత్తి

చేయగలిగిన వృత్తి చేపట్టు
ఆ వృత్తి ఏదైనా ఫర్వాలేదు
చేసే పనిలో సామర్ధ్యం చూపించి
నీ వృత్తికి మెప్పు తెచ్చుకో

## చెత్తవాగుడు

నోటిని అదుపులో పెట్టినవాడు
హృదయాన్ని తెరచి పెట్టినవాడు
చెత్తవాగుడుకు దూరమవుతాడు
సహృదయులకు దగ్గరవుతాడు









## సమస్యలు తెచ్చు

మధువు మైకమునిచ్చు
మగువ సౌఖ్యమునిచ్చు
యీ రెంటికి ఖర్చు హెచ్చు
తుదకు సమస్యలు తెచ్చు



## ఒక్కొక్క మెట్టు

వందమైళ్ళ ప్రయాణమైనా
ఒక్క అడుగుతో ప్రారంభించినట్లే
జీవితంలో ఒక్కొక్క మెట్టు
ఎక్కుతూ
నూరు మెట్లెక్కి నీ ఆశాసౌధం
చేరుకో





## ఆవగింజంత అదృష్టం

బ్రతుకంతా బండచాకిరి చేసినా
తిండి దొరకనివాణ్ణి
కష్టం చేయకుండానే అన్నీ
అనుభవించేవాణ్ణి
అర్హతలేకుండానే అందలం
ఎక్కేవారిని చూస్తుంటే
మేరుపర్వతమంత మేధాశక్తికన్నా
ఆవగింజంత అదృష్టమిన్న
అనిపిస్తుంది

## తృప్తి

లక్షలు సంపాదించే లక్షాధికారీ
జీవితంలో ఏదో కొరవడిందని
బాధపడకు
నీవు కోరుకునే ఆనందం, తృప్తి
కిళ్ళీకొట్టు కృష్ణ కళ్ళలో లభిస్తుంది
చూడు







## వడ్డించని విస్తరి

జీవితంలో సదా ఆనందం పండాలని
ఆశించే మనిషీ!
అది లభించలేదని నిరుత్సాహంతో
కృంగి పోయే బదులు
మానవజన్మ వడ్డించిన విస్తరి కాదని
తెలుసుకుంటే బాగుపడతావు ఓ
మనిషీ!






## వారూ ఉన్నారు

నీవు చెప్పే నీతిసూక్తులు
నీవు తీసే ప్రభోధాత్మక చిత్రాలు
ఎవరికి కావాలని
విమర్శిస్తున్నారు కొందరు
అర్థం చేసుకొని
అభినందిస్తున్నా రెందరో



## నవ్వుతుంది



లోభిని చూసి డబ్బు నవ్వుతుంది
భోగిని చూసి ఇంద్రియములు
నవ్వుతున్నవి
క్షణికమైన శరీరమును చూసుకొని
మురిసే
మూర్ఖున్ని చూసి మృత్యువు
నవ్వుచున్నది



## ద్వేషించడం

అభిమానం చూపడం తప్పుకాదు
దురభిమానం పనికిరాదు
ప్రేమించడం తప్పుకాదు
ద్వేషించడం పనికిరాదు





## అండదండలు

ధనదాహమున్న వారికి స్వార్థం
ఎక్కువ
చదువుకున్న వారికి ఐకమత్యం
తక్కువ
అందుకే ప్రపంచంలో ఏమి
సాధించాలన్నా
సామాన్య ప్రజల అండదండలు
అవసరమన్నా



## అంతాపోతుంది

నేను - నాఇల్లు
నా ఆస్తి - నా పిల్లలు
అనే మత్తు అంతా ఒక్కసారే
దిగిపోతుంది
ఆ మృత్యుదేవత పిలుపు రాగానే!





## ఇద్దరు ఖైదీలు

జైలు జీవితమనుభవిస్తున్న ఇద్దరు
ఖైదీలలో
ఒకడు కటకటాల వెనుక
కఠిన బాధలు తలుచుకొని
కన్నీరు కారుస్తుంటే
మరొకడు అనంతాకాశంలోని
తారలను చూసి ఆనందించాడట !

## ఉత్త హంగామా

ఒక దినం పెళ్ళికొరకు
సంవత్సరం పొడుగునా హంగామా
చేసినట్లే
జీవితమంతా హడావిడి చేస్తున్నాం
ఒక దినం చావడానికి !





## ఓడిపోయినవాడు



జీవితంలో ఒకసారి ఓడిపోయినవాడు
అన్ని పోగొట్టుకున్నవాడుకాడు
తనలో ఉత్సాహం, కోల్పోయినవాడే
సర్వం పోగొట్టుకున్నవాని కింద
లెక్క



## తన్మదీయ

అనుకోకుండా అందలం ఎక్కితే
ఊహించని రీతిలో సిరివరిస్తే
తాను మెచ్చింది రంభ అంటాడు
తాను మునిగింది గంగ అను
కుంటాడు





## వినండి

మట్టిలో కలిసిపోయే ముందు
మంచి పనులు కొన్ని చేయండి
ఒక ఇంటిలో దీపం పెట్టండి
ఒక అభాగ్యుడి జీవితంలో ఆహ్లాదం
నింపండి !

## విశ్రాంతి

జీవన సంగ్రామంలో నిరంతరం
పోరాటం సల్పి అలిసిపోయిన జీవి
చివరకు మృత్యువునే అర్థించిందట
కాస్త విశ్రాంతి ప్రసాదించమని !









## మధురానుభూతులు

ఏకాంతంలో ఏటి ఒడ్డున కూర్చుని
నీటిలో ఓ రాయిని విసిరితే
ఆ లోతుల నుండి ఎన్ని జ్ఞాపకాలు
సుళ్ళుతిరిగినవో
ఎన్ని మధురానుభూతులు
స్మృతిపథంలో కదలాడినవో!

## పాపాలఫలం



ఏడ్చేవానికి చేసిన సహాయ ఫలం
నవ్వుతూ అనుభవించు
నవ్వుతూ చేసిన పాప ఫలితం
ఏడుస్తూ అనుభవించు—





## సంస్కృతం

సంస్కారం తెలుపునది సంస్కృతి
సంస్కృతి నేర్పునది సంస్కృతం
అందుకే సంస్కృతం నేర్చుకో
సంస్కారవంతుడవు కా!

## సత్సాంగత్యం

సత్కార్యం చేయడానికి
సత్సంకల్పం అవసరం
సత్సంకల్పం కలగడానికి
సత్సాంగత్యం అవసరం









## శక్తి

కండలు కరిగేలా కష్టించు
కొండలను పిండి కొట్టే శక్తి
సంపాదించు
కాలం ఎదురు తిరిగినా
కండలను కొండలుగా పెంచి నీ
కార్యం సాధించు



## శిక్ష

తప్పొకరు చేస్తున్నారు శిక్షొకరను
భవిస్తున్నారు
యీ ప్రపంచ రీతి అర్థం కాదు
తప్పు చేసిన వాడు తప్పించు
కుంటున్నాడు
అమాయకుడేమో బలి
అయిపోతున్నాడు !